# బాల వ్యాకరణం

# సంధి పరిచ్ఛేదం

## వర్ణలోప – అనుకరణ సంధులు

ఉపన్యాసకుడు

డా.రామక పాండురంగ శర్మ

# అత్తు లోపం

45. అది యవి శబ్దంబుల యత్తునకు వృత్తిని
లోపంబు బహుళంబుగా నగు.

నా + అది = నాది, నాయది.

నా + అవి= నావి, నాయవి.

ఉదంతములగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద లోపంబు లేదనియు;
నిదంతంబులగు తద్ధర్మవిశేషణంబులకు మీఁద నిత్యం బనియు
బహుళ గ్రహణముచే నెఱుంగునది.

వచ్చునది, వచ్చునవి. వచ్చెడిది, వచ్చెడివి.

# ము లోపం

46. పడ్వాదులు పరంబు లగునప్పుడు ముదర్ణకంబునకు
లోప పూర్ణబిందువులు విభాష నగు.

భయము + పడె = భయపడె, భయంపడె, భయముపడె.

సూత్రము + పట్టె = సూత్రపట్టె, సూత్రంపట్టె, సూత్రముపట్టె

ఈకార్యము కర్తృవాచి ముదర్ణమునకుఁ గలుగదు.

గజము పడియె, అశ్వము పడియె.

# ము లోపం

47. మధ్యమ పురుష మువర్ణకంబునకు హలవసానంబులు పరంబు లగునపుడు లోపము విభాష నగు.

చూడుము + నన్ను= చూడు నన్ను, చూడుము నన్ను.

ఇటు+ చూడుము = ఇటు చూడు, ఇటు చూడుము.

చూడు మనియె, విను మనియె.

ఇచ్చట నచ్చు పరం బయినది కాఁబట్టి లోపము లేదు.

# ము లోపం

48. వ్యతిరేకమధ్యమ మువర్ణకంబున కెల్లయెడల లోపంబు విభాష నగు.

నమ్మకుము + ఇట = నమ్మ కిట, నమ్మకు మిట.

# ము,డుఙ్ లోపం

49. ఆమ్రేడితంబు పరం బగునపుడు మధ్యమ ము,డుఙులకు లోపంబు విభాష నగు.

ఉండుము + ఉండుము = ఉం డుండుము, ఉండు ముండుము
కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు,కొట్టుఁడుకొట్టుఁడు.

## అత్తు లోపం

* నా + అది = నాది, నాయది
* నా + అవి = నావి, నాయవి

## ము లోపం

* భయము + పడె = భయ పడె, భయం పడె, భయము పడె
* చూడుము + నన్ను= చూడు నన్ను, చూడుము నన్ను
* నమ్మకుము + ఇట = నమ్మ కిట, నమ్మకు మిట

## ము డుఙ్ లోపం

* ఉండుము + ఉండుము = ఉం డుండుము, ఉండు ముండుము
* కొట్టుఁడు + కొట్టుఁడు = కొట్టుకొట్టుఁడు,కొట్టుఁడుకొట్టుఁడు.

# విసర్గ లోపం

50. విసర్గంబున కనుకరణంబున లోపం బగు.

వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె

# అత్తునకు ఓత్వం

51. అనుకృతిని నమశ్శబ్దము తుది యత్తున కోత్వము విభాష నగు.

తుభ్యం నమః + అనె = తుభ్యం నమ యనె, తుభ్యం నమో యనె.

ఈకార్యము లాఁతిచో సహితము గానంబడియెడి.

గతానుగతికో లోకో యటంచున్.

# ద్విర్వచనం

52. అనుకరణంబునం దుదిహల్లునకు ద్విర్వచనం బగు.

కింతత్ + అనియె = కిం తత్తనియె

కస్త్వమ్ + అనియె = కస్త్వ మ్మనియె.

# ద్విర్వచనం

53. అనుకరణంబునం దహమాదుల మకారంబునకు ద్విరుక్తి విభాష నగు.

దాసోఽహమ్ + అనె దాసోఽహ మ్మనె, దాసో ఽహ మనె.

తత్ కర్తవ్యమ్ + అనె తత్ కర్తవ్య మ్మనె, తత్ కర్తవ్య మనె.

# వృగాగమం

54. ఉదంతనామంబున కనుకరణంబునందు వృగాగమం బగు.

ఇయం ధేనుః + అనె = ఇయం ధేను వనె.

అనుకృతిని నిడుదకుం గుఱుచ యగు నని యొకండు పలికె నది నిరాకరంబు.

దుర్భలస్య బలం రాజా యన వినవే.

# వి సంధి

55\. వాక్యావసానంబున సంధిలేమి దోషంబు గా దని యార్యు లండ్రు.

సత్యము సర్వశ్రేయము. అది లేనిచో సర్వధర్మములు వ్యర్థములు.
ఇట్లు సంధివిరహంబు కావ్యంబులం బాదాంతమంద చూపట్టెడి.

# అనుకరణమందు...

| | |
|---|---|
| విసర్గ లోపం | * వర్ధతాం శ్రీః + అనియె = వర్ధతాం శ్రీ యనియె |
| అత్తునకు ఓత్వం | * తుభ్యం నమః + అనె = తుభ్యం నమ యనె,<br>తుభ్యం నమో యనె. |
| ద్విత్వం | * కింతత్ + అనియె = కిం తత్తనియె<br>* దాసోఽహమ్ + అనె దాసోఽహ మ్మనె, దాసో ऽహ మనె. |
| వుగాగమం | * ఇయం ధేనుః + అనె = ఇయం ధేను వనె |

